## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100067496

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ప్రసూనాంజలి



తెల్ల సాంబశివరావు



జాంధ్రపేట
(వయా) చీరాల.
(గుంటూరు జిల్లా)

శ్రీరామాయ నమః

# తొలిపలుకు

శ్రీ తేళ్ల సాంబశివరావుగారు నా సహోపాధ్యాయులు, సుహృద్వరేణ్యులు, స్నిగ్ధహృదయులు. వీరియందుగల దృఢశీలము, ఆస్తికభావము, వినమ్రత, యనుసద్గుణములు నన్ను మిక్కిలి యాకర్షించుచుండెడివి. అప్పుడప్పుడు వేదికపైనుండి వీరొసంగు నిరర్గళోపన్యాస వాక్ప్రవాహమును గ్రోలియు, రసవత్తరములగు పద్యములను వినియు కరంబానందించుచుండెడివాడను. ప్రస్తుతము వీరలుద్యోగవిరమణం బొనర్చి విశ్రాన్తిబడయుచునొకనాడు తలవనితలంపుగ నాకగపడి తామురచించిన 'ప్రసూనాంజలి'కి తొలిపలుకు వ్రాసియిమ్మనికోరిరి. తామింకేమైనగ్రంథముల వ్రాసియుంటిరా? యనినేనడుగ అప్పటికప్పుడే యొకమూడు గ్రంథములను నాకొసంగి వీనినిగూడ తాముపరికింపుడని కోరిరి. అవి 'చైతన్యప్రభువు' 'శివమహిమ' గద్యరత్నమంజూష. ఇవియగాకయింకను గొన్ని గ్రంథములు తాము రచించినవిగలవనియు, ప్రస్తుతమవి యందుబాటులో లేవని యువక్కాణించిరి.

వారొసంగిన గ్రంథములను జదువగానాకమితానందము కల్గినది. ప్రాచీన నవీన సిద్ధాన్తము లనుకూలంకషముగఁ జర్చించి వారొసంగిన భావములు మేధస్సునకెంతయో విశాలతనుజేకూర్చి ఆస్తికతను రేకెత్తించును. సువర్ణహారము, కళాలాధ

నము, కవీ! ఇత్యాదిగ్రంథములు ఆంగ్లాంధ్ర పత్రికల ప్రశంసల నందుకొన్నవి. కవి సామ్రాట్టుల, కళాపరిపూర్ణుల యాశీస్సుల బడసినవి. చైతన్యప్రభువు, గద్యరత్నమంజూష యనునవి గద్యగ్రంథములు. చైతన్యప్రభువుని జీవితచరిత్రమును అవతార ప్రయోజనమును వారియుపదేశములను రూపించునది. చైతన్యప్రభువనెడి గ్రంథము. గద్యరత్నమంజూషయందు అమూల్యవిజ్ఞాన రత్నములెన్నియో నిక్షేపింపబడియున్నవి. పూర్వోక్త గ్రంథములన్నియు చిరకాలము క్రిందటనే ముద్రింపబడినవి. పునర్ముద్రణ భాగ్యమును నోచుకొనకుండుటచే నేడవి పాఠకులకు దుర్లభములు. నేటియువకులకు తద్గ్రంథపరనమత్యంతావశ్యకమగుటచే ఉదారులగు దాతలువానిని పునర్ముద్రణము గావించి పాఠకుల కందిచ్చుట ముఖ్యావసరమై యున్నది.

ఇకప్రస్తుత గ్రంథము ప్రసూనాంజలి. ఈచిన్ని హొత్తము కవి తనకుశివకేశవుల యందుగల యద్వైత భక్తిని, ధారాశుద్ధిశోభితమగు సలలిత పద్యరచనతో కొనసాగించెను. నవ్యమతప్రవక్తలను, జాతీయనాయకులను,సొంపుగవర్ణించెను. ఆంధ్రదేశమునకును, ఆంధ్రభాషకును, నిరంతరసేవ యొనర్చిన కవితల్లజులను పండిత ప్రకాండులను సంస్మరించెను. స్వాతంత్ర్య ప్రాప్తికి ముందును, తరువాతను దేశకాలపరిస్థితులను సింహావలోకన మొనర్చి దేశాభివృద్ధికై తన యాకాంక్షను వెలువరించెను.

ఈ కవి తల్లజూడు దీర్ఘదర్శి. ఎంతటి దైవభక్తుడో అంతటి దేశభక్తుడు. సనాతన సంప్రదాయములందెంత భక్తితత్పరుడో వ్యసిద్ధాన్తములందంత పరిశీలనాత్మకమగు విశ్వాసముగలవాడు పురాణమిత్యేవ నసాధు సర్వం నచాపి కావ్యం నవమిత్య వద్యం ంతః పరీక్ష్యాన్యతరద్భజన్తే మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః నెడి కాళిదాసుని సూక్తి ఈతనియందు చరితార్థము.

సర్వశక్తిభరితుఁడగు పరమేశ్వరుడు శ్రీ తేళ్ల సాంబశివ రాయకవి వర్యునకు ఇతోధికముగ నాయురారోగ్య సంపదలఁ బ్రసాదించి ఇంకను నుత్తమ కావ్యసృష్టిచే సరసుల రంజింప వ ట్లనుగ్రహించుగాక!

ఇ తి శ మ్.

ల, -65.

సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ
కొమాండూరి తిరువేంగళాచార్యులు.



# కృతజ్ఞతలు

నా సాహిత్య కృషిలో సహాయపడుచుండిన శ్రీ జాన వీరభద్రయ్య, నాగమల్లయ్య సోదరులు, శ్రీ చింతా కుమారస్వామి, శ్రీ జాన సూర్యప్రకాశరావు గార్లు (మోరి) ప్రశంసనీయులు. వారికి నాయెడ గల శ్రద్ధ మరువరానిది.

నా యీ ఖండకృతిని ప్రచురించుటకు తోడ్పడిన యుదారులు శ్రీయుతులు నూనె వెంకటస్వామి, బుద్ధి వెంకటేశ్వర్లు, కోట శ్రీరామమూర్తి, గుంటి భాస్కరరావు, పి. బలరామయ్య చౌదరి, కొత్త రామమూర్తి, కోట వీరాస్వామి, పద్మనాభుని జోగీశ్వరరావు, వువ్వాడ వెంకటవరదయ్య, చుండూరి సుబ్బరామయ్య అన్నదాత వెంకటేశ్వర్లు, అకురాతి పూర్ణయ్య, చామర్తి సత్యనారాయణ, చుండూరి వెంకటేశ్వర్లు గార్లు వారికి నేను కృతజ్ఞుడను.

ప్రసూనాంజలి కి అమూల్యమైన తొలిపలుకు శోభగూర్చిన నా పూజ్యమిత్రులు, సంస్కృతాంధ్ర ఋ, సాహిత్యవిద్యాప్రవీణులు శ్రీమాన్ కొమాండూరి ార్యులు గారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు. ప్రదాతలై నిరవధికముగ ప్రేమాదరములఁ టూపు జ్ఞా చంద్రమౌళి, M B.R.S గారికి నా కృతజ్ఞతా నములు.

— కృతికర్త.

సూచన:– 9 వ పుటలో 6 వ పంక్తిలో "సరసోదంచిత కావ్యకీర్తిద" అనుదానిని "కరముత్కృష్టయశఃప్రదంబగు" అనియు, 30 వ పుటలో 17 వ పంక్తిలో "గరుణారసంబుత్తమంబై" అనుదానిని "గరుణారసంబు సంభావ్యమై" యనియు సవరించుకొని చదువదగును.

కోదయము, సకల జన విహితము చైత
న్యకరము, సుఖప్రద మ
_క శ్రేయఃపథమది శోభించు నెదన్.

మధురము లీలామహిమలు
మధురము నీ యోగ పణితి మధురము పల్కుల్
మధురము నీ సర్వస్వము
మధురావాసా! స్మరింతు మది నినుఁ గృష్ణా!

మానవుఁడవొ! మాధవుఁడవొ!
ఏ నది యెంచక స్మరింతు నెద నినుఁ గృష్ణా!
నీ నామసుధా పానమె
యానంద శుభము లొసంగు ననిశము మాకున్.

ఆ తతమైన జ్ఞానవిషయంబులఁ దెల్పిన సద్గురూత్తముల్
తులై పరగు నాగమ పాపయ నామధేయులన్
దు ధర్మముఁ బ్రబోధముచేసెడు సాధువర్యులన్
రింతు మది సుందరవాఙ్మయ సృష్టికారులన్.

# శివస్తుతి

ధనిగృహమందుఁజొచ్చి ధనధాన్యములంగొన లోభియై సదా
పనిపడి కల్లమాటలనుబల్కు నుపాయములెన్నొ పన్ని నా
మనమది చోరపద్ధతిఁ గ్రమంబునుదప్పి చరించునో శివా!
కని కృప నాదుచిత్తమును గట్టి యధీనముచేసికొమ్మదే!

కైలాసంబున రత్నధామమున శ్రీ కాత్యాయనీ వల్లభున్
నీలగ్రీవుని నిందుమౌళిఁ బ్రమథానీకంబుతో నేకమై
శూలీ! శంకర! పాహి! పాహి! యనుచున్ శుద్ధాత్మ సేవించు త
త్కాలంబు న్ముదమార నేఁ గడపుభాగ్యంబెప్డు సిద్ధించునో.

మానవులెంత మూర్ఖులు! సుమంబులకై గిరికందరంబులన్
కానన సీమలన్ మఱి నగాధములైన సరోవరంబులన్
బూనికఁ దిర్గుచుంద్రు కడుఁబొక్కి శ్రమింత్రు మహేశ! పూజ క
ర్హానమనః ప్రసూనము సముంచితమై వికసించియుండగన్

నల్లని మెడఁబొల్చు నైగనిగ్యముతోడ
మూడుకన్నులనొప్పు మోముతోడ
హరిణ విభూషిత హస్తవైభవముతో
ఘనమైన వృషభ వాహనముతోడ
గిరిజాసమాశ్లేష పరిపుష్ట తనువుతో
ఖండపరశురుచి గరిమతోడఁ
బరవశత స్తుతించు పరమేష్ఠితోడను
ముదమున జేల్గొట్టు మునులతోడ

నాట్యముంజేయు ప్రమథగణంబుతోడ
నలరు నీ చారుతరమూర్తి నక్షియుగ్మ
పర్వముగ దర్శనముసేయు భాగ్యమెపుడు
కలుగనున్నదొ! నాకు శంకర! మహేశ!

పాపజీర్ణచ్ఛద ప్రకరంబు రాలెను
భక్తిలతావళి ప్రాకఁజొచ్చె
సలలితపుణ్య కిసలయముల్ చిగిరించె
గుణకోరకంబుల కొమరుమిగిలె
జపతపః పుష్పముల్ సౌందర్యమున మించె
సత్కర్మవాసనా జాలమొప్పె
మధుర చిదానంద మధుబిందువుల్ పార్లెఁ
బరమ తత్త్వజ్ఞాన ఫలము పండె

శంకర ధ్యాన దివ్య వసంతకాల
పుణ్య సౌభాగ్య సంప్రాప్తి పొలుపువెలయ
అస్మదీయ హృదయవనమందు శోభ
భవ్యమై రమించెను భక్తవంద్య మగుచు॥

('శివానందలహరి' నుండి అనూదితము)



# మాతృదేవీ స్తవము

అమ్మా! నిన్ను స్మరించుచుందును ద్రిమూర్త్యాత్మాశ్రయంబైన నీ
విమ్మా మాత్మ గృపావిలోకనముచే నీక్షించి రక్షించి క
ష్టమ్ముల్ దూరమొనర్చి హర్షమును మత్స్వాంతంబునంగూర్చి శీ
ఘ్రమ్మే మమ్ముఁ దరింపఁజేయుమి! సమగ్రంబైన శ్రేయంబులన్

తల్లీ! నీదుపదాబ్జముల్ గొలుతుఁ జైతన్యంబుఁ జేకూర్పుమీ!
యుల్లంబందుఁ బ్రశస్త కార్యములకే యుత్సాహముంగొల్పుమీ!
కల్లోలంబులణంచి మాపయిని నీకారుణ్యముం జూపుమీ!
యుల్లాసప్రద జీవయాత్ర సతతోద్యోగంబుతో నొప్పగన్.

అమ్మయె సుఖ దుఃఖములన్
ప్రాణుల మనస్సునన్ విహరించున్
మెప్పగఁ దల్లిని
మ్రొక్కుచు నుతింతు నిశ్చల భక్తిన్.

స్మరింపక సమాహిత చిత్తముతోడ మానవుం
డులోమునిగి హాయనముల్ భవరోగశోక సం
బునం దిరుగు సర్వకళల్ గురిపించు నీదయో
నావళియె ప్రీతినిఁ గూర్చును దివ్యవృత్తులన్.

దకారణంబయినత్వచ్ఛ్రీ వైభవంబెంచగా
దివిజుల్ చాలరు మానవుల్ వలతురే! దీవ్యత్కృపాదృష్టిచే
అవికారాధ్య పథంబునన్నడపుమీ! అంబా! మముల్ శాంభవీ!
రవికోటి ప్రతిమాన కాంతియుత! నిన్ బ్రార్థింతు నశ్రాంతమున్

ఏ సమయంబుఁ జూచియొ మహింబడు నీ తనువున్ స్థిరంబుగా
నాసదలంచి మానవుఁడహర్నిశమున్ బహు భోగకాంక్షఁగా గాం
తా సువిలాసవశ్యుఁడయి తద్దయు దీనతఁగాంచి యేడ్చు నీ
భాసుర పాదసేవయె యపారముదంబిడుఁ దల్లి! వానికిన్.

సకల చరా చరాత్మక విశాలజగత్తున నీదు ధర్మముల్
ప్రకటముగా విరించి నిజవైభవ సృష్టినిఁ జేయు సూర్య చం
ద్ర కిరణకాంతికోటులు ముదంబునొసంగు సమస్తజీవులున్

శౌరహస్య పరిపూర్ణవికాస విశేషయోగముల్
సూక్ష్మశక్తి గుణబంధుర రూప రుచి ప్రవృత్తులున్
దీప్తి సంజనకకోమల వైభవ భాగ్యసంతతుల్
ాసముల్ భగవతీ! భవదీయకృపా ప్రసాదముల్.

లయ కాలాగ్నిశిఖాళి తాపమును జల్లార్చున్ ద్వదాలోక నా
చయ సంజాత విభూతి భద్రమహిమల్ చంచద్విలాస ప్రభా
వ్యయ సృష్టిన్ సమకూర్ప దక్షమగు మాతా! నీకృపోత్పన్నమౌ
నయ కార్యాచరణ ప్రతాపగరిమల్ నానావిధానంబులన్.

బిందుస్థాన నిరంతరోజ్జ్వల కళావీచీ మనోజ్ఞాకృతీ!
ఇందు స్వాదుసుధారసోపమ విశుద్ధేద్య ప్రభావాన్వితా
వందారు ద్రుహిణాచ్యుతామరచయా! స్వాంతంబునన్నిన్ను నా
నందజ్ఞానమయీ! స్మరించెద నపర్ణా! లోకమాతా! ఉమా!

అఖిల జగములతల్లి! సుధార్ద్రహాస
ధవళ చంద్రికల్ చిమ్మి హృత్తాపతమము
తెల్లఁ బోగొట్టి నిజకృపాదృష్టిమాకుఁ
గువలయంబున శుభముఁ జేకూర్పు మంబ!

కైటభారి పురందర క్రతు భుజాది
భక్త సేవిత త్వత్పాదపద్మ యుగళ
విగళిత సుధాఝరీపాన విహితమతిని
ఓ చిదానందలహరి' మమ్మోముతల్లి!

గగనభాసుర నక్షత్రగణము నీకుఁ
గంఠమాలా మణిశ్రేణిగా వెలుంగుఁ

సుమహిత తటిల్లతాకోటి శోభితాత్మ!
శీర్షపద్మాటవీమధ్య చిత్కళావి
హారిణి! సదాశివప్రియా! అఖిల విశ్వ
మాత! అహ్లాదలహరి! నమస్కృతంబు!

హైమవతి! భవన్నయనాంతహారి వృత్తి
ఇందుమోహన త్రిపురారి మందహాస
మధుర సంయోగసంసిద్ధి మహితశోభ
సర్వభువన సంసృష్టి కుశలము తల్లి!

నీవు భాస్కరోజ్జ్వలకాంతి నిచయమందు
నీవు యామినీపతికళా నివహమందు
నీవు సర్వతేజఃపుంజ నిధులయందు
సంచరించు చిచ్ఛక్తివి శంభురాణి!

నీదు నిత్యార్చనంబున నాదు మనము
లీనమై సకలశుభ కేళీప్రశస్త
మధుర మహితజీవితవృత్తి మర్మమెఱిగి
యుల్లసిల్లుఁగాత! మృడాని! యుర్వి సతము.

మూడు జగముల సృష్టించి ముద్దుఁగొలిపి
కరముఁ బ్రేమఁ బాలించి సంబరముఁగూర్చి
లయముఁ జేయు మహేశ విలాసినీ! య
తీవగుప్తరూపిణి' నిన్ స్తుతింపఁ దరమె!

భగవతీ! ఇందులేఖా ప్రభావరూప!
శాంభవీ! గిరితనయ! దాక్షాయణీ! యు
మా! కుహారిణీ! సతత నిస్యందమాన
బోధపీయూష! మముఁ గృపఁ బ్రోవుమంబ!

భక్తచేతః కమలవన భాస్కరరుచి!
శుద్ధ శశిఖండ భాస్వత్ ప్రసిద్ధ మకుట!
హరిపితామహ శతమఖాద్యర్చనీయ!
శైవతను దీపితా! నమస్కారమంబ!

శీర్షభాస్వచ్ఛశికళా విశేషరూప!
శైవదీధిత్యపాసిత షడ్వికార!
శివ చిదమృత సింధుస్నాన భవిక సుభగ!
శాంభవీ! నమోఽస్తు భువన జనని! శక్తి!

సుమహిత తటిల్లతాకోటి శోభితాత్మ!
శీర్షపద్మాటవీమధ్య చిత్కళావి
హారిణి! సదాశివప్రియా! అఖిల విశ్వ
మాత! అహ్లాదలహరి! నమశ్శతంబు!

# భారతీస్తవము

లోకారాధ్యవు లోకరక్షణ కళాలోలాత్మ వానంద ని
ష్ఠాకేళీ విభవాస్పదంబగు మహాసాహిత్య సాహిత్య సు
శ్రీ కల్యాణ పరంపరా విలసితాక్షీణ ప్రకాశాఢ్య వీ
వో కారుణ్య పయోనిధీ! నతులివే! ఓంకార నాదేశ్వరీ!

పురుషార్థప్రదదివ్యమార్గ విలసత్ పూర్ణేందుబింబాననా!
సరసోదంచిత కామ్యకీర్తిద మహాకావ్యప్రభా శోభితా!
పరమజ్ఞాన విలాసినీ! భగవతీ! బ్రహ్మాండ భాండోదరీ!
వరతేజోమయరూపిణీ! నతులివే! వాగీశ్వరీ! భారతీ!

మూలాధారములోఁ బరాఖ్యఁ గళలంబొల్పారి మోదంబుతో
నాలాపించుచు నాభియందునను బశ్యంతీ సమాఖ్యన్ భళీ!
శ్రీలంగొల్పెడి మధ్యమాఖ్య హృదయక్షేత్రంబులోఁ గుల్కుచున్
స్థూలాకారము వైఖరిం జిలుకుచున్ శోభించు వాణీ! **నతుల్.**

శ్రీరసాత్మ సమారంభ సారచారు
రూపిణీ! భావసామ్రాజ్యదీపికా ప్ర
భావ! సర్వశుక్ల! యమృతవాణి! విశ్వ
జనని! కృపఁ జూడుమీ! నమస్కృతము నీకు.

---

# శ్రీ వేంకటేశ్వర స్తోత్రము

తిరుపతి కొండపై వెలసి దివ్యపథంబును జూపు దేవుఁ డ
బ్బురమును గొల్వ శ్రీయుతుఁ డపూర్వ విధంబున భక్తకోటులం
గరముఁ గృపారసంబొలుకఁగాంచు దయానిధియైన వేంకటే
శ్వరుని పదాబ్జముల్ గొలుతు భక్తిమనోరథ సిద్ధి యేర్పడన్.

సరసము శాంతి దీప్తము ప్రశస్త విశేష రహస్య నిత్య భా
సురము, సుధారసార్ద్రము విశుద్ధము సత్యవిలోకనప్రదం
బరిభయదంబు విశ్రుత మహామహి మాధ్యముకాదె! వేంకటే
శ్వరుని కృపావలోకనము భక్తిభజింతుఁ దదీయసిద్ధికై.

రసమయ రూప! ఆర్త జనరంజక! భక్తసమూహ పాలకా!
అసురభయావహా! ప్రతత హర్షవిలాస విశేష దీపితా!
ముసరెడు కష్టముల్ గదిమి మోదముఁ గూర్పుము జీవితంబులో
దొసగులఁ బాపుమీ! హృదయ దుఃఖమడంపుము వేంకటేశ్వరా!

ఆయుష్యంబును, దేహదార్ఢ్యమును విద్యారోగ్య భాగ్యంబులన్
దీయంబైన మనంబు ధైర్యమును సందీప్తాస్య తేజంబు ల
క్ష్మీయుక్తంబగు జీవితం బిడి హృషీకేశుం గృపం జూడుమీ!
శ్రేయంబుల్ వెలయింపుమీ! నతులివే! శ్రీవేంకటేశా! ప్రభూ!

ఆర్తినినుందలంచి తమ యాపదలన్ని నశింపఁ గొండపై
వర్తిలు నీదు విగ్రహము భక్తినిఁ గాంచి భజింపగా జగ
త్కర్తవు ధర్తవీవనుచుఁ గానుకలీయగ భక్త కోటి సం
కీర్తన సేయువచ్చుదురు కేశములిత్తురు వేంకటేశ్వరా!

వేలకువేలు యాత్రికులు విశ్రుతభక్తిని వేలరూకలన్
మ్రొలనుబెట్టి హారతులఁ బూజలఁ జేయగ వచ్చుచుందు రీ
మేలిమి కాన్క సొంపులను మిక్కలి శోభిలు నీదుమూర్తి లోఁ
గ్రాలు రహస్యముం దెలియరాదు కదా! ధర వేంకటేశ్వరా!

ధనధాన్యంబుల వేంకటేశ్వర! నినుందన్పంగలేనారయన్
ఘనవాణీ నటనావిలాసమయ సత్కావ్యంబులన్ వ్రాయ నో
పను నీ క్షేత్రముఁ జేరి పూజలను నిన్ భావింపగాఁ జాల నొ
క్క నమస్కారముతోడ నీ కృపను నేఁగాంక్షింతు నత్యంతమున్

శ్రీకరమౌ వివాహములఁ జేయుచనేకము నీదుకొండపై
సాఁకి నవీనదంపతుల సమ్ముదమిత్తువు వేంకటేశ్వరా!
ప్రాకట ప్రేమదృష్టుల నపారము మాపయిఁబంచి నిత్యమున్
శ్రీకళ మాగృహంబున వసింపగఁ జేయుము నీకు మ్రొక్కెదన్.



# శ్రీ రామ స్మరణము

నీ పాదంబులు రాతి నాతినొనరించె న్నీ ప్రతాపాగ్నిలోఁ
బాపాకారులు దుష్టరాక్షసతతుల్ భస్మంబుగానైరి నీ
ప్రాపుం బొంది తరించిరెందఱొ మహిన్ ద్వన్నామమే నేఁడు ఁ
ద్వ్యాపారంబుల మాకుఁ గూర్చు రఘురామా! భక్తకల్పద్రుమా

సాహిత్యంబున కాదియై వెలసె నీచారిత్రమా కావ్యప
ద్యోహప్రాఢిమ కీవె హేతువగుటన్ ద్యోతించు వాల్మీకి యా
స్వాహావల్లభదీప్తితో సుజనభావంబందు విజ్ఞాన క
్రమా హీనద్యుతి మాకుఁ గూర్చి రఘురామా! భక్తకల్పద్రుమా!

# ప్రతీక్షణము

ఎన్నియుగంబులో కడచె నిష్ఠముతీరగ నిన్ స్తుతింప నా
పన్నులఁ బ్రోతువంచు ఋషి వాణిపురాణములందుఁ దెల్పునే
తెన్నున నిన్నుఁ గాననగు? దృష్టికి మాంద్యముపోదు వాక్కులోఁ
బన్నెముపండు మంత్రములు పార్లవు దేవ! యిదేమికర్మమో!

ఏయసమాన రూపమునొ యెంచి కనుంగొన జన్మజన్మముల్
ధ్యేయముగా వరించినహీనతమంబునఁ దిర్గుచుంటి నా
యాయతనంబు లెప్పుడు ఫలించునొ! దృష్టికి దివ్యకాంతులే
న్యాయమునన్ లభించుఁ? బరమౌషధమేదియొ తోఁచదో ప్రభూ

దోనాదము లోపలన్ సతము నీహృద్య ప్రభావంబులన్
దీప్తిన్ బ్రభు! నీదురూపమును వర్ణించు న్మదంబారగా
దృశ్యంబులఁగాంచ దేహమున మూలాధారసంసుప్తచిత్
దైవాణి ప్రబుద్ధమౌ విధము వర్తింపన్ బ్రబోధించెదున్.

కాఱుమబ్బులు క్రమ్మిన కాయమందు
'నేను నే' నని లోలో ధ్వనించు నేదొ!
జ్ఞానభానూదయమెపుడుఁ గాననగునొ!
శ్రీప్రకాశ మెపుడు విరాజిల్లఁగలదొ!

---

# కబీరు గీతావళి

ఏకులంబునఁ బుట్టిన నేమి! సాధు
వర్గమునకు జ్ఞానంబె! సర్వస్వ మవని,
గత్తిదాచెడు నొఱకేమి కలదు ఘనత!
అసికె వెలఁ గట్టి యిచ్చెద రఖిలజనులు.

జలము నందుఁ గుముద్వతి పులకరించు
గగనమున శిశిర కరుఁడు కాంతి వెలయుఁ
దనకు నచ్చిన దానినే ధరణి వలచి
మురిసి సుఖియింతు ప్రాణులు మునిగి ప్రేమ॥

ప్రియతముఁ దభిలషింపగాఁ బ్రేమ రసము
నీకహంకార భావంబు నిండియుండె!
అవ్యయానంద సంప్రాప్తి యలరుటెట్లు!
ఒక్క యొఱ రెండు ఖడ్గంబు లుండుటెట్లు?

నిర్మల ప్రేమ నిలయంబు నీదుతనువు
దీని సంసార మమత బంధింపఁ జూచు
అదనుఁ గాంచి మోహము విడనాడ శివుఁడు
పదువులిడును సంధింపగాఁ బరమశక్తి.

పూలతోటలోఁ బ్రేమంబు పొసగఁ బోదు
సంత వెలయిచ్చి కొనఁజూడ సాధ్య పడదు;
ఆత్మ దుగ్ధాబ్ధియందుఁ బ్రేమామృతంబు
జుఱ్ఱుకొన వచ్చునహమును జుల్కఁ జేయ.

ప్రేమ శూన్యమౌ హృదయంబు ప్రేత వనము
కాని యన్యంబుగా దానిఁ గాంచఁ జనదు;
గొప్పగా గాలిఁ బీల్చెడి కొలిమితిత్తి
కానియది ప్రాణి హృదయంబు కాదు నిజము.

జలముఁ బ్రేమించి బ్రతుకు మత్స్యములు సతము
లోభి విత్తంబు నార్జించు లోలతఁగను;
మాతముద్దుఁ గొమరునిపై మమతఁ జూపు
భక్తుఁడు హరినామ జపమె వలచినిలుచు.

ఎదను దొంగిలించితివి రేయింబవళ్ళు
నీదు ప్రణయ సంతప్తుండ నేనుదేవ!
కంటికిం గూర్కు రాదేమి? కనులయందు
నీవెస్థాన మేర్పఱచు కొంటివి కదోయి!

ధరణి సహజమై జతఁగూర్చు తత్ప్రణయము
హాయిఁ గూర్చు మధురమయి యమృతము వలె
అడుగనెద నిచ్చు ప్రేమ మధ్యమము సుమ్ము
పెనగులాడుచుఁ గలసిన వెతలెగతులు.

ఆత్మ దర్శనానుభవము నడుగజ్ఞాని
యెటుల ననుభూతిఁదెల్ప నూహింపఁ గలడు!
అలగుడాస్వాదనోద్భవ హర్షరేఖ
మూగవాఁడెట్లు వర్ణింప మోమునెత్తు?

సాధుజనులు సద్గుణములె సంగ్రహింతు
రవగుణమ్ముల నుంతయే నరయఁ బోరు;
పరమతత్వంబె వారికి గరముఁ బ్రీతి
భ్రమరము విరితేనెనెత్రాగఁ బరువులెత్తు.

మృతినిఁ జూచి భయంపడు పృధివియేల!
అదియె నాకు బ్రహ్మానంద మట్లుతోఁచు!
ఎపుడు మృతివచ్చునో యని యెడదఁ దలచి
దానిఁ బడయ నిరీకింతు దైవచింత.

ఏమిచెప్పుదు ధరణిలో నెల్ల జనులు
బోధ సేయఁ జూతురె కాని బుద్ధి కలిగి
ఆచరించెడు వారు లేరరయ నీవు
వారియడుగు జాడల వెళ్లవలదు సుమ్ము.

సద్గురునికి సమానుఁడౌ స్వజనుఁ డెవడు!
సాధుపురుషుని కెనయైన సరసుఁ డెవడు!
దైవమువలె నెవ్వాఁడు హితమ్ముఁ గూర్చు
హరిజనుని మించు నుత్తమ నరుఁ డెవండు!

ధరణినెల్లఁ దెల్లని కాగితమ్ము చేసి
కాననాంతర తరువులఁ గల మొనర్చి
అర్ణవ మషీరసమున వ్రాయుంగనేమి?
గురుని గుణము వర్ణింప దుష్కరము సుమ్ము.

సాధు పురుషుల దేహమే సర్వభువన
పతిని దర్శించు దివ్య దర్పణము సుమ్ము
పరమ పురుషుని దర్శింపఁ బురుషులెల్ల
సాధువులఁ జేరి సిద్ధిని సంతరింత్రు.

ఈ శరీరము విషలతకైన తలంప
గురుఁడమృత ధారఁ గురిపించు పురుషరత్న
మతని సత్కృపఁ బ్రాణమ్ము లైన నొసఁగి
పడయఁ గాంచుట నరుని సౌభాగ్యమోయి!

గురుకృపా భిక్షఁ బడసిన నరుని యెడద
ద్యుమణి చంద్రకోటి ప్రభల్ తోఁచుచుండు
బయట వెలిగెడి జ్యోతులు పరమమైన
జ్ఞానకాంతి వివర్ణమై కళలఁ దక్కు.

సర్వగతమగు హరి విలాసంబుఁ బడయు
మోహనాకృతి దర్శించి మురియునంత
అతఁడె తుదకు నేనయ్యె నేనతఁడనైతి
ఇరువురికి నభేదంబు ప్రాప్తించె భళిర!

పంచభూతాత్మక మగు ప్రపంచమందు
వలపు వలను జిక్కు కొనిన భక్తి యెట్లు!
బంధనమ్ముల విదలింప భక్తి కుదురు
అపుడె భక్తుండనై దైవకృపను గాంతు

పరిమళించెడి కస్తూరి బయటలేదు
ఆత్మయందు గుబాళించు నహరహంబు
భ్రమను మృగముకైవడి నీవు బయటవెదుకఁ
దిరుగనేల! సఖుండ! ఆతురముతోడ.

పరుసవేదిని స్పర్శించు భాగ్యకలన
ఇనుము హేమమ్మై దీపించు ననుపమరుచి
మానవుఁడు హరినామ సంస్మరణవలన
బంధనవిముక్తి మాధవాభయమునందు.

తిలలలోపలఁ దైలంబు వెలయురీతి
అగ్నితేజస్సు చెకుముకి నలరువిధము
పరమపురుషుఁడు నీలోన మురియుచుండు
ధ్యానపరుఁడవై వీక్షించు మతని నీవు.

ఎడద జ్ఞానదీపికవెలిగించి నీవు
దేహమున నింపుము విమలదీప్తిచయము
యోగనిష్ఠాపరుండ వైరాగములను
దగ్ధమొనరించి బ్రహ్మంబుఁ దలపుమోయి.

ఎడద హరినామ చింతన విడువకుండఁ
జేయఁ బాతకౌఘమ్ము నశించిపోవు
గడ్డివామిలో సూక్ష్మాగ్ని కణముపడిన
మండి నుసియగు రూపనామములు లేక.

హరిని స్మరియించు మానవుం డాపదలను
సౌఖ్య సమయంబునన్ హరి స్మరణరాదు;
సౌఖ్యవంతుఁడై హరిపూజ సల్పునేనిఁ
బ్రాణిఁ జెనకదు దుఃఖంబు క్షోణినెపుడు.

కరమునందున జపమాల తిరుగనేమి!
వక్త్రమున జిహ్వ హరిపేరు పలుకనేమి!
మనసు నల్దిక్కులం గోష్ఠి మగ్నమైన
దైవచింతన మని దానిఁ దలపనగునె!

సర్వలోకైక విభునకు సముఁడెవండు!
సర్వశక్తి సంపన్నుండ ఖర్వమహిముఁ
డతఁడు భక్తుల దోషంబు లరఁయబోక
ఒకని మేషంబులో వారినుద్ధరించు.

ఈ చరాచర జగమీశ్వ రేచ్ఛ వెలయు
హరికృపా శూన్యుఁడౌ ప్రాణి యల్పుఁడరయ
హరియె బ్రహ్మాండ మణువుగ నణువుఁ ద్రుటిని
నీరజ భవాండముగఁ జేయ నిపుణుఁడెంచ.

నేను చేయున దంతయు నీకృపామ
హిమమె! దేవ! నాయాధిక్య మేమిలేదు;
ఎపుడు నేనుచేసితి నంటి నపుడునీవు
నాదు నంతరంగమున నున్నావు పలుక.

హంసనీరంబు విడనాడి యమృత మధుర
దుగ్ధ పానముంజేసి సంతోషమందు;
సారభూతమౌ పరమార్థ సంగ్రహంబు
పుడమిఁ జేయంగ మనుజుండు పొందుముక్తి.

ప్రవిమల హరినామంబు క్షీరంబు విషయ
వాసనాజాల ముదకంబు పగిది నొప్ప
సాధు పురుషుండు హంసయై సర్వలోక
విభునినామ దుగ్ధముఁ ద్రావి వెలయు భువిని.

అక్షియందునఁ దారాడు నట్టి పాప
విధముఁ బరమాత్మ నీలోన వెలయుచుండుఁ
గాని మూర్ఖులై ప్రాణులు కాంచ బయట
వెదుక యత్నింతు రిది యేమి? వెఱ్ఱిధాత్రి.

ప్రభుని శుభనామ ముజ్జ్వల రత్ననిభము
తన్మణిని హృదయమున భద్రంబు చేసి
ప్రమదమందుము నీవే షరాబు దాని
విలువఁ గట్టలేడు కొనలేడిల నెవండు.

దైవ రక్షితుండగు వానిఁ దాకలేరు
ప్రబల శత్రువులేకమై వచ్చియున్న
హరికృపా దృష్టి భాగ్య మున్నంత వఱకు
ఎవ్వరేమియుఁజేయ లేరిలను వాని॥

బ్రహ్మరంధ్ర నివాసియై పరగు జీవుఁ
డనవరత మనాహతనాద మాలకించుఁ
బరమపురుషుని దర్శనభాగ్య కలన
నతని రోమరోమము దీపమై వెలుంగు.

స్వామి! విరహ వేదన యాత్మఁ బ్రబలుచుండెఁ
గానుపించుము లేచేని కాయమునకు
మృత్యువాసంగుము బ్రతుకింక మేలు కాదు
విరహబాధ సహింప నాతరము కాదు.

వలచి జీవాత్మ పరమాత్మఁ గలసిపోవ
జ్యోతి యంతట వెలిఁగె సముజ్జ్వలముగ
ఆత్మ పరమాత్మ సంయోగ హర్షసుషమ
నవ వసంతవిలాసముల్ చివురుఁ దాల్చె.

ప్రేమదావాగ్ని యెదలోనఁ బెరిగి మండి
పొగలు గుప్పును లోలోనఁ బొగులుచుండు
దానిఁ బరజను లూహింపనైనలేరు
కాంచఁగలఁడు ప్రియతముఁ డొక్కఁడె దాని.

పడవ జలముతో నిండినఁ బాఱఁబోసి
ఇంట విత్తంబు పెరిగిన నీవిచేసి
ఆత్మ నుద్ధరించుకొనువాఁ డనఘజీవి
సాధుపురుషుఁడు పూజ్యుండు సజ్జనుండు.

స్వస్థదేహివై హరిపూజ సలుపుమోయి
ద్రవ్యవంతుఁడవై గొప్ప దాత వగుము
బుద్ధిబలముచేఁ బరహితమును దలంపు
మపుడె నీ జన్మ సార్థకమని తలంతు.

విషయ సుఖములపైఁ గాంక్ష వెడలిపోయె
వెనుకకుం దగ్గి చింతయు వీడిపోయె
అవ్యథితమై మనసు శాంతినంది వెలిగి
ఆత్మరాజ్య ధౌరేయుండవై రమింప.

యాచనా వివశతఁ జేయిచాచువాఁడు
చచ్చిపోయినవానికి సముఁడు ధాత్రి
కలిగియుండియు లేదని పలుకువాఁడు
అతనికంటె ముందుగ మృతుడైనవాఁడు.

స్వామి నిండుగాఁ బ్రేమించు స్వాంతమునకు
బట్టు మడిబట్టల ధరింప వాంఛపొడమ
దలసి సొలసి గాఢసుషుప్తి నందువాఁడు
పఱుపు దిండులకై వేచి బాధపడడు.

# శ్రీ దయానంద సరస్వతీ స్వామి స్తవము

సర్వామ్నాయ రహస్యవేది, ఘనవిజ్ఞానోజ్జ్వలన్మూర్తి స
ర్వోర్వీ ధర్మ విశుద్ధ దీపకుని, సత్యోత్కృష్ట నేత్ర ప్రభా
ఖ్యానంద విలాసలోలుని, మహాకారుణ్య వారాశి, ఆ
సర్వ ప్రాణిహితైషి నార్యమత సంస్థా బ్రహ్మఁ జింతించెదన్.

బ్రహ్మ తేజము నిజఫాలభాగంబున
దీపింప వర్తిల్లు దివ్య పురుషుఁ
డాత్మతత్త్వ ప్రసంగామృత ధారల
జిజ్ఞాసువ్రలఁ దన్పు సిద్ధమూర్తి
సత్యము సంతత సత్ఫలదంబని
గర్జించు శత్రుభీకర మనీషి
ఆర్యమత స్థాపనాఖండ దీక్షా ప
రతఁ గీర్తిఁగాంచిన బ్రహ్మచారి

సర్వవిజ్ఞాన నిలయుండు సాధుమూర్తి
ఆర్యసేవా విశుద్ధ లక్ష్యాగ్రగామి
యోగి శ్రీ దయానందుండు త్యాగబలుఁడు
బ్రహ్మపథమున నడచిన రాజహంస.

నీ దేహంబున వెల్గుకాంతితతి వాణీ భర్తకే యొప్పు నీ
వాద ప్రాభవ మన్యపండితులకప్రాప్యంబు నీ సిద్ధికిన్
నీ దివ్యత్వ విభూతికిన్ విమలమౌ నీ ప్రజ్ఞకుందత్త్వ గో
ష్ఠీ చార్వ్యమ్మున కేరుతుల్యులు? ప్రభూ! శ్రీ యోగతేజోనిధీ!

నవయుగ పూరుషుండవయి నైగమధర్మము నిల్పి సంస్కృత
ప్రవిమల సద్గుణంబులను భారత భూమినిఁ జాటి జాతికిన్
నవయుగ శక్తిఁ బోయగఁ బునాదులవేసి స్వరాష్ట్రభాషకుఁ
భువనయశంబు నందితివి పుణ్యగుణాన్విత! నా నమస్కృతుల్.

ఒకడే దేవుఁడు వేదవాక్తతియె సత్యోత్కర్షముం దెల్పు నా
ర్యకులాభ్యున్నతి మర్మమిద్దియని గాయత్రీమహత్త్వంబుఁ దా
సకలోర్వీ జనసంచయంబునకు హర్షంబొప్ప బోధించెఁ బా
యక రాత్రిందివముల్ దయానిధి ప్రసిద్ధాత్ముండు ధర్మస్థితిఁ.

స్పృశ్యుఁ డస్పృశ్యుఁడను జాతిభేదములను
నాఁడె నీవు పాటింపక నంత ధర్మ
సిద్ధికిఁ బెట్టనికోటవై నిలిచినావు
బళిర! నీ ధర్మమే గాంధి వలఁచినాఁడు

వజ్రవైడూర్య రత్నప్రభా ప్రశస్తి
తావక బ్రహ్మవిజ్ఞాన ధనము నెదుట
దీటుగా నిల్వఁజాలునే? దీవిశేష!
సత్తపోవ్రత! నా నమస్కార శతము

వందే శ్రీ శుకయోగితుల్య చరితం వాణీస్వరూపం ప్రభుమ్
సింహస్థైర్య వికాస నిర్భయముఖం యోగీంద్రతేజోనిధిమ్
దీనస్త్రీజన కల్పభూరుహసమం ప్రజ్ఞానిధానం గురుం
కుందాళీందు సమాన నిర్మల యశోదీప్తం దయావైభవమ్.

# శ్రీ రామకృష్ణ పరమహంస స్తవము

శ్రీ మద్భారతభూమిపైమరల నుజ్జీవింపఁ జేయంగ జ్ఞా
నామోఘానసదృశద్యుతి ప్రతతిబ్రహ్మాండంబు మోహింపగన్
ధీ మద్బృందము బాపురే! యననమందీ భూత చైతన్యుఁడై
కామంబున్విదళించె సద్గురువు లోక క్షేమసంధాతయై.

పులకితమయ్యె వేదతరువుల్ చిగిరించె ఋషీంద్ర ధర్మముల్
పొలసెను విశ్వభాగ్య పరిపోషక పుష్పలతాళి జ్ఞానికో
కిలకల నాదముల్ సుజనకీర మృదూక్తులు సందడించె నీ
యిలపయి రామకృష్ణుఁడుదయించగ సర్వము దీప్తమైచనెన్.

ఆసాధుత్వ మనన్య సాధ్యమ సమంబా యోగ సంపత్తికై
లాసగ్రావ నిభోన్నతాధ్వగతి లీలా ప్రీతి యా సంయమం
బా సత్య శ్రితవాణి యామహిత నిత్య బ్రహ్మ సాక్షాత్కృతి
వ్యాసంగంబు జగన్నుతంబు ఋషివర్యా! రామకృష్ణ ప్రభూ!

లలనా రత్నము మాతృదేవి వలెనాలాపించి పూజించి యా
వల శిష్య ప్రకరంబుఁ బుత్రులగతిన్ భావించి ప్రేమించి క్ష్మా
వలయుంబందునఁ దత్ప్ర బోధముల దివ్యజ్యోతి వెల్గించి యు
జ్జ్వలి తాధ్యాత్మిక కాంతులంజిలికితప్పా! రామకృష్ణ ప్రభూ!

బహు జన్మంబుల సేకరించిన తపో భాగ్యంబులీ రీతిగా
మహితస్ఫూర్తి నొసంగె దేహమున బ్రహ్మజ్ఞాన పీయుషపా
నహితాత్మోద్ధరణ ప్రశస్త శుభ సంధానంబు శోభించె లో
కహితాత్ముండగు రామకృష్ణునకు లోకంబెల్లఁ గొండాడగన్.

ఇహ రాజ్యంబులఁ బ్రాజ్య బోగముల నిస్సీ! యంచుఁగాల్దన్ని ప్ర
త్యహముం బ్రహ్మమునిష్ఠఁగొల్చి ధర బ్రహ్మానందసామ్రాజ్యము౯
బహుదిక్కుల్ నెలకొల్ప శిష్యగణముం బంపించి శోభింపవే
తుహినాద్రింబలె దివ్య పీఠినిగురూ! ధుర్ధర్షతేజంబుతో.

పతయాళుస్థితి నున్న భారతధరా ప్రాచీన దివ్యార్ష సాం
ప్రత కల్యాణ పరంపరల్ నిలుపగా భాగీరథీ వాహినీ
తతఘట్టంబునఁ గాళికా పదములన్ ధ్యానించి సేవించి శా
శ్వత కీర్తింగని శక్తిఁ గూర్చితివి దేశంబందు నస్మద్గురూ!

తుహినాద్రింబలె నిశ్చలుండు పృథుయాదో భర్త రీతిన్ గభీ
రహృదాఢ్యుండల శంకరుంబలె నపారజ్ఞాని సూర్యుంబలె౯.
బహుతేజస్వి మనీష గీష్పతివలెం బ్రౌఢుండు వాగ్ధాటిలో
ద్రుహిణుంబోలు నరేంద్ర శిష్యుడు భళీ! స్తుత్యుండవో సద్గురూ!

కనకాంక్షా జ్వరపీడితంబయిన యీ ధాత్రీతలంబందు నీ
కనకాంక్షా రహితాత్మశుద్ధియె సమస్త స్నాయుసందోహము౯
ధనవై ముఖ్యపరాయణానుభవ విద్యా పీఠముంజేసెఁ ద
ద్ధన లోభంబు విషాగ్ని భంగిఁ గనునీతత్త్వంబు ధ్యేయంబహో!

శ్రీ శారదా పతికి వా
గీశత్వీడపాంపతికి మహిత సుకృతికి యో
గీశాకృతికి శ్రుతినిరతి
కాశానాశ చణమతికి నంజలి మ్రోడ్తు౯.

క్షాంతి శ్రీ విలసద్ హృదబ్జ సుషమా సంపన్న భాండార! ఆ
శాంత వ్యాప్తవళక్ష కీర్తి కలిత వ్యాసంగ! సాధ్వగ్రణీ!
అంతశ్శుద్ధి సముద్భవామలిన యోగానంద సంపూర్ణ! వే
దాంతాత్యున్నత శృంగభాసిత మహాత్మా! మన్నమస్కారముల్.

పార్థివ విభవంబె పరమ లక్ష్యముకాదు
దివ్యరాజ్యంబు సాధింప వలయు
అర్థకామంబుల నాహరించుటె కాదు
ధర్మలక్ష్మి స్ఫూర్తిఁ దనరవలయు;
దేహ సౌష్ఠవముతోఁ దృప్తి నందుటయె కా
దాత్మ సౌందర్యంబు నందవలయు
బాహ్య ప్రకృతిశోభఁ బరికించుటయె చాల
దంతః ప్రకృతి దీప్తి నరయవలయు.

అక్షర నిపఠంబె యానంద మొసగదు
బ్రహ్మవిద్య కూడఁ బడయవలయు
ననెడు నీదు వాక్కులమృత ప్రవాహముల్
రామకృష్ణదేవ! ప్రణతిశతము.



# శ్రీ వివేకానంద సంస్మరణము

చిత్రమైనట్టి జగత్తులో నరులు దుశ్చేష్టా విమూఢాత్ములై
ధాత్రిన్ ధర్మము దైవమున్మఱచి కర్తవ్యంబుఁ బోనాడగా
స్తోత్రార్హంబుగ జన్మమెత్తి గురుశుశ్రూషాను రాగుండవై
క్షాత్రంబుంగని బ్రాహ్మశక్తి వితతిన్ సాధించినావోయతీ!

రవిబింబ తేజంబు రాణింప ముఖమందు
అంబుధి గాంభీర్య మలరుచుండ
వేదముల్ పలికిన విధిఁ దలపించె డి
విజ్ఞాన పూరిత విభవమొప్ప
వీరకేసరిఁ బోలె విహరించు రీవితో
భవ్య సౌందర్య ప్రభావ మలర
హేమాద్రినిభధైర్య హేలాతిశయముతో
మధుర సుధను గ్రక్కు మాటలొలుకఁ.

ప్రేక్షక శ్రోతృ జనులకుఁ బ్రీతిఁ గొలిపి
సర్వమత సామరస్యంబు సంతరించి
దేశ దేశాంతరంబులఁ దిరిగి నావు
పూజలను వివేకానంద! పొందినావు

ప్రణయ శ్రీ విముఖుండవై సుమహిత బ్రాహ్మస్థితిన్ జ్ఞానివై
ప్రణవధ్యాన మహత్త్వముందెలుపునా వాక్శక్తి బోధించి స
ద్గుణ సందోహము సత్యధర్మముల ముగ్ధుల్‌గా ప్రజావ్రాతముల్
గణనీయంబుగ వేద శాస్త్ర మహిమల్ గాపాడినావోయతీ!

అంచిత తత్త్వదీపికల యార్షమతమ్ము ను విశ్వమెల్లెడన్
బంచి గురూపదేశమును భక్తి హృదంతరసీమఁదాల్చి రో
మాంచము కల్గురీతి నసమాన సనాతన ధర్మబోధ గు
ప్పించితి వాత్మవైభవము విందొనరింప వివేకసంయమీ!

తనజ్ఞానంబును యోగశక్తులను విద్యన్ బాండిత్యప్రజ్ఞలన్
దనసంస్కారము దేహదార్ఢ్యమును శుద్ధబ్రహ్మతేజస్సు వా
గ్ధనమున్ సర్వము ప్రాణికోటి హితమై ధర్మప్రచారార్థమై
అనుమానింపక ధారవోసిన వివేకానందుఁ గొండాడెదన్.

వేదాంతమ్మది పొంగిపొర్లినది నీ విజ్ఞాన వారాశిలో
ఆ దేవత్వ మలంకరించె భవదీయాపూర్వ రూపంబులో
శ్రీదంబైన పరోపకారగుణరాశి ప్రాభవంబొప్పె నీ
స్వాదు స్వాంతమునందు ధీరపురుషా! స్వామీ! వివేకాంబుధీ!



# శ్రీ స్వామి రామతీర్థుఁడు

జ్ఞానివై యాత్మ విజ్ఞాన సుధామయ
　　　పాత్రల దొర్లించి ప్రమద మొసఁగి
గోసాయివై పూర్వవాసనా విరహిత
　　　విమల జీవితమును వెలుఁగఁజేసి
శాస్త్రపారగుఁడవై సకల నాస్తికులను
　　　జెవిపట్టి యాడించు చెలువుఁజూపి
ఆచార్యుఁడవయి విద్యార్థి బృంద హృదయాం
　　　బుజములు వికసించు బోధచేసి.

ఖండ ఖండాంతరంబులఁ గలయఁ దిరిగి
వినెడివారి మాంత్రికముగ్ధులనుగఁ జేసి
ఆత్మతేజోఽబ్ధిలో స్నానమాడినావు
స్వామి రామతీర్థా! నమస్కారమయ్య!

విన్వీధి నెలవంక వెన్నెలల్ చిలికించి
　　　యంధకారంబుఁ బోనాడినట్లు
నందనోద్యానంబు నందలి పారిజా
　　　తము పరిమళమునఁ దనరులీల
నవరసంబులఁ గరుణా రసంబుత్తమం
　　　బైయుజ్జ్వలంబుగ నలరు విధము
అక్షరంబులలోన నాదియౌ ప్రణవంబు
　　　పురుషార్థ విస్ఫూర్తిఁ బొలయురీతి.

నిష్కళంకమై చెలువందు నీదుజీవి
తంబ ఖండ తత్త్వ జ్యోతిఁ దాల్చిపంచి
విశ్వమునఁ దుష్టి శోభల వెలయఁ జేసె
సకల జననుత గుణధామ! స్వామిరామ!

ప్రకట భాగీరథీ రంగత్తరంగముల్
భాతి నిర్మలవాణిఁ బలుకఁగలవు
నవనీతకిసలయోద్భవ మార్దవముతోడ
జనుల కుత్సాహ మొసంగఁ గలవు.
రాజాధిరాజ దర్ప విరాజమాన వి
భవరమ నీవు చూపంగఁ గలవు
సవితృమండల కాంతిజాలంబువలె నవి
వేక తమమడంచి వెలుగఁ గలవు

కేల దమ్మిడి లేక పకీరు రీతి
ఇతర రాజ్యములకుఁ బయనింపఁ గలవు
సద్గుణకలాప! పావనజ్ఞానరూప!
స్వామిరామతీర్థా! నమస్కారమయ్య!

ఏ నోములనునోచి యే దైవమునుగొల్చి
నీ తల్లి కడుపార నిన్నుఁ గనెనొ
ఏగ్రహబలమున నే ముహూర్తంబునఁ
బ్రేమఁగొల్ప నవతరించినావొ
ఏ పుణ్యభూమిలో నే ధ్యానధారఁ ద
పస్సస్యముల్ నీకుఁ బండినవియొ
ఏ ప్రాక్పునీత సుకృత తైలమున నీ వి
మలచరిత్ర జ్యోతి వెలిగినదియొ

అనుపమ దరహాసములు దొలాకాడుచుండ
నీ ప్రసన్నవదనమును నిఖిల జనులు
కాంచి యమృతోక్తులను విని కదలి చనరు
స్వామిరామతీర్థా! నీ ప్రభావమేమొ!

---

# శ్రీ త్యాగరాజు

నాదబ్రహ్మ కుపాసనల్ సలిపి గానస్వాదుపీయూష స
మ్మోదంబున్వెలయించి యుజ్జ్వలయశంబున్ ధాత్రిపైనిల్పి య
హ్లాదాపార సుఖంబు లందితివి రామాంఘ్రిద్వయోత్కృష్ట పూ
జాదీప్తాత్మ వికాస! సత్కృతి విలాసా! త్యాగరాయాహ్వయా!

నిధి సుఖమా! రాముని స
న్నిధి సుఖమా! యని పలుకుచు నిర్మలవాణిన్
మధురంబని రాముని స
న్నిధిఁ జేరిన నాదయోగి నిన్ను నుతింతున్.



# ఆత్మ ప్రబోధము

సర్వ వేదాంత సిద్ధాంతసార గోచ
రుండు వాఙ్మనసా గోచరుండు మద్గు
రుండు గోవిందుఁ డానందరూపుఁ డతని
కపహితమ్ముగ వందనమాచరింతు

నరజన్మంబును బుంస్త్వలబ్ధి మఱి గణ్యంబైన విప్రత్వ వే
దరమా మార్గపరాయణత్వమును శాస్త్రజ్ఞాన సంప్రాప్తి ని
ర్భర సమ్యక్ సదసద్వివేచనము నద్వైతార్థమున్ మోక్షమున్
ధర నొక్కొక్కటి నైకజన్మసుకృతార్థంబై వశంబయ్యెడిన్.

ధాత్రి మూఁడు దుర్లభములై తనరుచుండుఁ
బరమశివునికట[illegible] వి ప్రాప్తమగును;
మానవత్వ మొక్కటి మోక్షమార్గ మొండు
సిద్ధపురుష సమాశ్రయ క్షేమ మొకటి

నరుఁడై యెట్టులొ పుంస్త్వమంది నిగమన్యాయంబుతో నొప్పి యే
పురుషుం డాత్మవిముక్తిసిద్ధిని సతంబుం గోరి యత్నింపడో
ధర మూఢుండయి యాత్మవంచకుఁడుగా దౌర్భాగ్యుఁడై సంసృతిన్
గర మాసక్తిఁ జరించు భోగవితతిం గాంక్షించి మోహంబునన్.

మానుషదేహము మఱి స
మ్మానిత పురుషత్వమంది మనుజుడు శుచియై
జ్ఞానోపాసన ముక్తినిఁ
గానడొ జడు సతనికంటెఁ గానము ధరపై.

వ్రతముల నాచరించినను వాదము శాస్త్రములందుఁజేసి దే
వతలకు యజ్ఞముల్ సలిపి పావనపూజలఁ జేయఁగల్గినన్
స్తుతమతి నాత్మబోధ మది శోభిలకుండిన ముక్తిలేదు వి
స్తృతముగ జన్మమెత్తిన మహీస్థలి బ్రహ్మ శతాంతరంబులన్.

ధనముల సత్యపదార్థము
మనకు లభింపదని శ్రుతులు మఱిమఱిపలుకున్
గొనకొని శాశ్వతపదవికి
నెనయునె? కారణములై మహిం గర్మంబుల్.

ధరఁ జిత్తంబునఁ గోరగావలయు విద్వాంసుండు దర్మంబుతో
స్థిరమై యవ్యయమైన మోక్షపదవిన్ దేహార్థభోగాళికిన్
గుఱికాకుండఁ ద్యజించి సద్గురుని సద్గోష్ఠి ప్రభావంబునన్
బరతత్త్వంబున నిత్య సత్యమున భావంబున్ బ్రసారించుచున్

జనన మరణ సాగరమగ్న జనుఁడు తన్ను
వినుత శక్తిప్రవృత్తి వివేకదృష్టి
సర్వ సంకల్ప రహితుఁడై సాధువగుచు
నుద్ధరించుకొనుటయె మహోత్తమ కృతి

ఆత్మసాక్షాత్కృతికి యోగ మభ్యసించి
రమ్య నిష్కామ యోగ మార్గంబువలచి
జనన మరణ కర్మకశపాశచయముఁ ద్రెంపఁ
గడగుటే యుత్తమోత్తమకార్య మవని.

పురుషుఁడు భ్రాంతిలోఁబడి యపూర్వభుజంగ భయంబుతో మన
స్స్థిరతకు దూరుఁడౌ నతఁడెచేరి నిజంబుగ రజ్జువంచుఁ దా
నెఱిగినపిమ్మటన్ భయవిహీనత శాంతినిఁబొందుధాత్రి బం
ధురమగు సత్యముందెలియ దుఃఖవినాశము నిత్య హర్షమున్.

ఆత్మసంయమమున నంతఃకరణశుద్ధి
సాధకునకు ముక్తి సరసనుండుఁ
బరమ సత్యపదవిఁబడసి శోభిలుటకు
గౌణములగు దేశకాలగతులు

తత్త్వమస్యాది వాక్యార్థధర్మ మాత్మ
శోధనమున బ్రహ్మవిదుల సూక్తివలన
సత్యమని రూఢియగుఁగాని స్నాన దాన
తీర్థయాత్రలవలన సాధింపఁబడదు.

ఇది సత్యం బిది తద్విరుద్ధమని తర్కింపన్ సమర్థుండుగా
నెదఁ గర్మంబుల వానిక్రలో విషయభోగేచ్ఛా తిరస్కారియై
ముదమొప్పార శమాది సద్గుణములం బూతప్రభాశాలియై
విదితుండైన ముముక్షువర్యుఁడగు నుర్విం బ్రహ్మజిజ్ఞాసకున్.



# గాంధిస్మృతి

గురు విజ్ఞాని శిరోవిభూషణుఁడవై క్రొంగ్రొత్తరూపంబులన్
బరమశాంతి రహస్యముల్ జనులకున్ భావించి బోధించుచున్
బురుషార్థప్రద పుణ్యమార్గపరతన్ భూమిం బ్రకాశించి కీ
ర్తి రమాశేషుఁడ వైతివయ్య! శుభమూర్తీ! గాంధి సత్యవ్రతా!

ఏ యొకనాటికో మృతిజనించినవారికిఁ దప్పదైన బా
బూ! యొక పిచ్చివాఁడిటులఁ బుణ్యచరిత్రు నినుం దుపాకిచే
నే యవినీతిపైకొన వధించెనొ! దానిదలంప బ్రద్దలౌ
మా యెద- 'రామ! రామ!' యను మంత్రముఁ బల్కుచు వీడితేమమున్.

కన్నులపండువౌ మిసిమికాంతులనీనెడి గాంధిమేని సం
పన్నతఁ గాంచలే మసురభావ పరాయణులై ధాత్రి వి
ద్వన్నుత శాంతిదూత ఘన తత్త్వము నిర్వ్యాసము కర్ణపేయమై
తిన్నగఁ దన్ముఖంబుననదింపదు సర్వము స్వప్నమయ్యెగా.

ప్రాణములుండుదాఁక యుగవాణి వచించిన మేటి నీవు త
త్ప్రాణములం ద్యజించి తమ వారసులైన బుధాళినోటఁ ద
ద్వాణిని దేశదేశముల వర్తిలఁజేయు పవిత్రవివు నీ
వాణియు నీవు కామగవిపద్ధతి వర్తిలరే చిరంబుగన్.

# సరోజినీదేవీ స్మృతి

విద్దెల కధిదేవత యన
ముద్దుగఁ గవితామృత రసమును గురియుచుఁ దా
నిద్దురఁజెందె సరోజిని
పెద్దగ సర్వజన హృదయవేదన హెచ్చన్.

రసరూపిణి విదుషీమణి
కుసుమించిన లతయనల్ప గుణములపోవున్
వసుమతి కలంకృతి పవి
త్ర సువాసినియగు "సరోజ" తరలెం దివికిన్.

ముఖమెత్తిచూచెనా? ముచ్చటల్ గురిపించు
 శశిబింబ సురుచిర చ్ఛాయలొలుకఁ
గంఠస్వరంబును గదలించి పలికెనా?
 కిన్నెరతంతి మ్రోగింపనేర్చుఁ
గలమును జేఁబట్టి కడగెనా? వ్రాయంగ
 రమ్యాక్షర సుమ హారంబుఁగూర్చు
గర్జించి ప్రవచింపఁ గాంక్షించి మించెనా?
 ప్రబల శత్రువులకే భయముఁగొల్పు

దేశదేశాల స్వీయ సందేశములను
బాడనేర్చిన గాయనీ ప్రముఖురాలు
గాంధి యడుగుఁదమ్ములఁగొల్చు గరితమిన్న
వృద్ధ విదుషీమణి ధరణివీడి చనియె.

రసభాండంబులు దొర్లి పాఱినవి యా రామా మనస్సీమలో
నిసలైనట్టి కవిత్వబీజములు తాల్చెం గావ్య వృక్షాకృతిన్
గుసుమించెన్ ఫలియించె భారతధరాకూతి ప్రబోధావళుల్
రసికోత్తంస శుకావళీహృదయ హర్షస్ఫూర్తి శోభిల్లగన్

# రాజేంద్రబాబు స్మృతి

అమృతప్రాయము ధర్మదీపితము జ్ఞానావిష్ట మాత్మక్షమా
రమణీయ ప్రతిపాదకంబు గుణ భద్రప్రాభవాఢ్యంబు ధ
న్యము రాజేంద్రునిజీవితం బకట! అంతంబయ్యెనే! ధాత్రి ద
క్షముఁజేకూర్చి స్వదేశవాసులకు- శక్యంబే! విధిందప్పగన్

తన సర్వస్వము భారతావనికి నే ధన్యాత్ముడిచ్చెన్ భళీ!
జనక క్ష్మాపతివోలె రాష్ట్రపతియై జ్ఞానంబునన్మించె నా
గుణ వారాశి "ప్రసాదబాబు" నిఁకపైఁ గూర్మిన్విలోకింప లే
మనఘాత్ము న్మహిఁ గీర్తికాయమది నిత్యంబై విరాజిల్లెడున్.

అల గాంధేయముతైన వాక్కులకుఁ దానాకారమై నిల్చె ని
శ్చల గంభీరపయోధిభంగి హృదయస్థైర్యంబుతో దేశమున్
దిలకించె న్నడిపించె- ధన్యుఁడత డెంతే నుగ్గడింపందగున్
గలకాలంబు ఋషీంద్రకల్పుఁడగు తత్కాంక్షల్ భువిన్వర్ధిలు



# సర్. పిట్టి త్యాగరాయ శెట్టిగారు

అక్షర విజ్ఞాన మంతయో యింతయో
ప్రతిసంఘమందున వ్యాప్తిఁగనుట
దక్షిణభారత ధరణిలో నెల్ల జా
తులవారు కనువిప్పి చెలువుఁగనుట
సాంఘికధర్మంబు సమమయి ప్రజలలో
వ్యక్తి వికాస భాగ్యంబుఁగనుట
అణుగారి శోషిల్లి యట్టడుగునఁబడి
వెతఁజెందువారి కున్నతికలుగుట

త్యాగమయమైన ఋషి జీవితంబు వలచి
నిను వరించిన పదవుల నీ యనుంగు
యోగ్యమిత్రులకిడిన నీ యుత్తమగుణ
తతి విశేషంబె! మూలంబు త్యాగరాయ!

వెలమ సింహంబు వివేక నిధానుండు
రామరాయణి నీకుఁ బ్రమద మొసగ
కూర్మ వెంకటరెడ్డి నిర్మలస్వాంతుండు
త్వత్ప్రేమఁగని మంత్రిపదవి నుండ
అన్నెము పరశురామాభిఖ్యుఁ డసమాన
చతురుఁడై నీకు హర్షంబుఁగూర్ప
ప్రభువు విల్లింగ్డను పరమ సంతుష్టుఁడై
భవదీయ నాయకత్వము స్తుతింప

పింజలాన్వయ వారాసి విధువు పత్రి
కాధిపతిగ సుబ్రహ్మణ్యుఁ డలరుచుండ
సకల దక్షిణభారతజనులు నీదు
నడుగుజాడల నడిచిరి త్యాగరాయ!

మానిత ధర్మదృష్టి నసమానముగా వెలయించి ధాత్రిపై
మానవ మంగళప్రద మమందపురోగతి దాయకంబు నౌ
భూ నుత నాయకత్వమునుబొంది పవిత్రవిధానవర్తివై
దీనజనోన్నతిన్వలచు ధీనిధి! జోతలు త్యాగభూషణా!

## శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు

నతులివె పురుషవతంసున
కతులోదారహృదయునకు న్యాయవ్రతికిన్
ధృతిశోభిత సన్మతికిన్
గృతిరచన పరాయణునకుఁ గీర్తిచ్ఛవికిన్.

స్త్రీ జన చింతామణికిం
బూజిత విజ్ఞానఖనికిఁ బుణ్యాత్మునకున్
దేజస్వికి నూర్జస్వికి
నైజాధ్యాపక వరునకు నతినుతి వితతుల్.

వీరేశలింగ కవికిన్
ఘోరాచారాద్రి దళనకులిశాకృతికిన్
దారుణ మహిళాదుఃఖ ని
వారణ దీక్షాపరునకు వందనములివే!

సకలాంధ్ర మకుట సన్నిభు
నకు బహుముఖ రచనసిద్ధున కుభయభాషా
ప్రకటిత విద్వాంసునకున్
సుకర్మనిరత హృదయునకు జోహారులివే!

ఆంధ్ర హృదుజ్జ్వలభానుం
డాంధ్ర యుగపురుషుఁడు శోభితాంధ్రసుధీంద్రుం
డాంధ్ర ప్రతిభాదీప్తుం
డాంధ్రజనాదర్శమూర్తి- ఆరాధ్యుఁడహో!

---

# ఓం శ్రీ యారాసు నీలకంఠస్వామి ప్రశంస

శ్రీ దివ్యాత్మ రమావిలాస హితభాషీ! ధీ నిధానా! త్వదీ
యౌదార్యాధ్యకృతుల్ తపోధనము మా కౌన్నత్యముంగూర్చి స
మ్మోదం బిచ్చెను బూర్వసద్గురు గణంబున్ మించి మీబోధ సం
పాదించెన్ భువిఁగీర్తి నిర్మలహృదబ్జా! నీలకంఠ ప్రభూ!

వేయిమయూఖముల్ చొనిపి విశ్వమునన్ వెలుగిచ్చు భాస్కర
ధ్యేయమహత్త్వమట్లు భవదీయ విశేష శివార్చనా క్రమం
బీయిల మాకుభక్తినిడి హృత్కమలంబున జ్ఞానదీపికా
శ్రేయముఁ గూర్చెస్వామి! విలసిల్లగ మాకుఁ బవిత్రభావముల్.

నియమాధీనుఁడవై విరక్తిని దపోనిష్ఠా గరిష్ఠుండవై
నయ విజ్ఞానరమా విరాజితుఁడవై న్యాయప్రభావుండవై
భయదూరుండవు నైగురుండవయి తత్త్వజ్ఞానరమ్యుండవై
జయముం గొంటివి జీవితంబున విశిష్టా! నీలకంఠప్రభూ!

ధవళచ్ఛాయలఁ జిమ్ముగడ్డము జగన్మాన్యంబుగా నొప్పగా
శివభావాత్మక భూతి కుంకుమభవచ్ఛ్రీ చిహ్నమైతోచ భ
క్తి విశేషంబును గొల్పువర్తనము నన్దీపించు మీమూర్తి కు
త్సవ మొప్పంగ నమస్కరింతుము సుధీంద్రా! నీలకంఠప్రభూ!

ధర్మపత్ని నాగమ్మయుఁ దాముఁ బూజ్య
పార్వతీ పరమేశ కృపాప్రదీప్తి
ధరశతాయుష్కులై శివధర్మములను
గఱపు చుండుఁడార్యా! దేశిక ప్రధాన!

# శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారి నిర్యాణము

శివసాయుజ్యముఁ బొందినాఁడు కవియౌ శ్రీ వేంకటేశుండు కిం
కవిమత్తేభ మృగేంద్రుఁ డాంధ్రకవితాకారంబలంకారదీ
ప్తి విశిష్టంబుగఁ దీర్చినట్టి కవిరాట్ ధ్యేయుండు దేవీస్తవ
ప్రవణుండీ శివరాత్రిపర్వమున సంప్రాప్తింపఁ గాలంబొగిన్.

కవియై పుట్టెను జీవితాశయములం గావ్యేందిరా నాట్యమే
రవణించెం బహుగద్య పద్యకృతి నిష్ఠాదక్షుఁడై పల్కె సం
స్తవనీయంబుగ శిష్యకోటికిఁ గవిత్వ ప్రజ్ఞఁజేకూర్చెధా
త్రి విశిష్టుండగు వేంకటేశకవి పొందెన్ రాజసన్మానముల్.

భారతీదేవి యాశ్రయ భాగ్యకలనఁ
బడయరాని వైభవములఁ బడసినాఁడు
దేవి కృపనంది శివరాత్రి దినమునందు
దేహయాత్రఁ జాలించె సుధీనుతుండు.



# కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి గారు

వాగనుశాసనుండు బుధవంద్యులు తిక్కన యెఱ్ఱనార్యులున్
యోగివరుండు పోతన రసోదిత కావ్యకళా పరిపూర్ణ వా
ణీ గరిమ ప్రకాశితులు నిల్పినయాంధ్రుల సాహితీక్షితిన్
నీగురు కావ్యముల్ వెలసె నిండుయశంబునఁ గృష్ణసత్కవీ!

పారాశరి విధంబుఁ బరమార్థ వేదివై
భారతామృతమును బంచినావు;
ప్రాచ్యసాహిత్యతత్త్వజ్ఞుండవై విగ్ర
హస్థాపనా పూజనందినావు;
శ్రీనాథునంతటి శేముషీ ఘనుఁడ వై
కనకాభి షేకంబుఁ గాంచినావు
పెద్దనార్యునిఁ బోలెవినుత కళాస్రష్ట
వై గండ పెండర మందినావు;

జంకు బొంకెఱుంగని వాక్ప్రవాహమంది
నీ సరికవులు లేరని నిలిచినావు
కుకవి శైల వజ్రాయుధ! సుకవిని చయ
సింధువిధుబింబ! కృష్ణశాస్త్రీ! నమస్సు.

# కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు

కశ్మలదూషితుల్ గడగడలాడంగ
'ఆంధ్రప్రశస్తి' ముందంజవేసి
ప్రాచీన సత్యధర్మంబుఁ బ్రతిష్ఠించు
వేయిపడగలతో వెలసి నిలచి
సకల బుధులు శిరసావహించెడి కావ్య
దర్పణంబులఁ దన్నుఁ దానెఱింగి
'కిన్నెరసాని'లో వన్నెఁ దెచ్చు ప్రణయా
ద్వైత భావశబలతను రచించి.

ధర్మలీలా రహస్యంబు తఱచి తఱచి
భారతాశయ దీపికాప్రభ జ్వలించు
సత్యనారాయణా! కవిచక్రవర్తి!
ప్రౌఢకవివర్య! నిను నుతింపంగఁ దరమె!

మధ్యాక్కఱలు వ్రాసి మహి యశంబునుగన్న
'విశ్వనాథ' కవి కవిత్వగరిమ
రామాయణ రచన ప్రౌఢిమఁ జూపిన
'విశ్వనాథ' కవి కవిత్వగరిమ
శృంగారవీధిలో నెద తీపివిరజిమ్ము
'విశ్వనాథ' కవి కవిత్వగరిమ
ప్రాచీన విజ్ఞానపారమ్యముం జూపు
'విశ్వనాథ' కవి కవిత్వగరిమ

భాషలోఁ జారు భావనాబలమునందు
స్తుత్య సముచితాలంకార శోభయందు
భారతాత్మ సందర్శనా ప్రేరణమున
ఆంధ్రవాణి కపూర్వంబు హర్షదంబు.

# శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారు

నీ వొక్క చోభళీ! నిండైన శశిఁబోలె
విమలవాక్కౌముది వెలయఁగలవు;
నీవొక్క తఱి సర్వనిగమ రహస్యముల్
ముత్తెంబులం బోలెఁ బోహణింతు
నీవొక్క వేళలో నెల్ల బ్రహ్మాండంబు
నక్షరపంక్తుల నాలపింతు
నీవొక్క పర్యాయ మేరికిఁ జొరరాని
భావాభ్రవీధుల బరుగు లిడుదు

నీబహుముఖ గుణాధిక్య మీరసార్ద్ర
హృదయ విస్ఫురిత మహితాహీన వచన
రచన రమ్య విన్యాసంబు ప్రతిభ తలప
సత్యనారాయణా! నీదు సహజ లీల.

పాయకతావి పూవునను బంధుర కౌముది పూర్ణచంద్రునిన్
వాయువునందు సంచలన వర్తిలి యొప్పును నీదువాక్కులోఁ
బేయముగా సుధాఝురులు వెల్వడు నిండుగ నట్లె సత్యనా
రాయణ! సాహితీ తపము ప్రస్తుతమయ్యె! వసుంధరన్ సదా.

మంజు బృందావనంబులో మహిత వృక్ష
పల్లవలతా నికుంజ ప్రభావిహార
తత్పరహరి వంశీనినాదంబొ యేమొ!
సత్యనారాయణా! నీప్రశస్త వాణి!

వేదవిత్సుధీ యోగీంద్ర విమల హృదయ
రంజక ఘనకర్పూర నీరాజనంబొ
మందమలయా నిలతరంగ మహిత గతియొ
సత్యనారాయణా! నీప్రశస్త వాణి.

---

## 'రావుసాహెబ్' బండ్ల బాపయ్య సెట్టిగారు

ఏకల్ప కుసుమావళీ సత్పరీమళ
మర్వి నాఘ్రాణించి యొప్పినావొ;
ఏ కామధేను మహిత పయోధారల
పాన భాగ్యంబును బడసినావొ;
ఎట్టి చింతామణి ష్మృణి వీచికల్ వచ్చి
నీదు కందోయిని నిలిచినవియొ;
ఏ సుధాధారల నిష్టంబు తీరంగఁ
గ్రోలి యెదకుఁ దీపిగూర్చి నావొ.

వేలధనము నున్నత పారశాల కొసగి
వేటపాలెము నందు గావించినావు
బహుళ విద్యా ప్రచారంబు బాపయార్య!
నీయశంబు శాశ్వతముగ నిలుచుఁగాత॥

విద్యార్థిబృందమున కిల
విద్యామృతధారల గురిపించెడి శశ్వత్
విద్యాసంస్థను నిలిపిన
విద్యాహిత మతి స్మరింతు విబుధులు మెచ్చన్.

వితరణఖనివి, వినయవివేక నిధివి,
బండ్ల బాపయాఖ్య! అపారభాగ్య
రాశి! భవదీయ మంజుల ప్రాభవంబు
సరస సౌజన్యము నుతింపఁ దరమె? ధరణి.

---

# కవీ! జోహారు

కవితోద్యానముఁ దెన్గుగడ్డ గురుసంకల్పాశ్రయంబై తగన్
గవిరాజన్యులు కావ్యవృక్షములతోఁ గావింత్రలంకారముల్
కవి 'యేట్కూరి' సువర్ణ చిత్రముల హెూఁ కన్నాకులై భావ ప
ల్లవ పుష్పంబుల శోభఁ గూర్చెడిని కల్యాణ ప్రభాసీమలై.

కవి సామ్రాజ్య ధురంధరుండు బుధలోకస్తుత్య కావ్య ప్రపం
చ విహార ప్రవణుం డపారమధురాంచచ్ఛబ్దపంకేరు హెూ
ద్భవుఁడాంధ్ర స్థల వీర పౌరుషల సత్క్రమ స్వరాలాపనా
సు విశేషుండగు నేటుకూరికుల తేజోరాశిఁ గొండాడెదన్.

'క్షేత్రలక్ష్మి'ని బండించి శ్రీలఁ గూర్చి
'మగువ మాంచాల' వెలయించి జగతి నాంధ్రి
హృదయ భావనా దర్పణంబెత్తి చూపు
నేటుకూరి నరసయ కవీ! జోహారు!

---

# నాఁడు

అది స్వరాజ్య భీషణ సమరాంగణమ్ము
నిలిచి రచట సత్యాగ్రహ బలము మెఱయ
మరఫిరంగుల ముందట నురముఁ జూపి
గాంధియోధుని సైనిక గణము నాఁడు.

వృద్ధనౌరోజి సువిశాలదృష్టి పూజ్య
మాలవీయుని యార్షధర్మ ప్రసక్తి
ఆ తిలకు మహాభాగుని యాత్మబలము
కేసరి సముడౌ లజపతి కీర్తి నెంతు.

చిత్తరంజన త్యాగసుశ్రీల నాంధ్ర
రత్న గోపాలకృష్ణుని రమ్యవాణి
ఆ ప్రకాశమ్ము వీరవిహార ఫణితి
నెహ్రూ నిజదేశభక్తి గణింతు భృశము.

ఆ సుభాషుబాబుని రణోద్యమ చరిత్ర
భరత సంతతి స్వాతంత్ర్య పరమకాంక్ష
దేశమహిళల త్యాగంబు దిగ్దిగంత
ములను గాన యోగ్యంబు ప్రమోదకరము.

ఆ శుభసమయ కార్యముల్ త్యాగదీక్ష
ఐకమత్య మా మహిత జయధ్వనులును
సూత్రయజ్ఞ మహింసా విశుద్ధనీతి
ఆ యపూర్వ ధర్మవిజయ మక్షయములు.

రాట్న గానరవము త్యాగరాట్కృతులను
మించి యమృతవృష్టినిఁ గురిపించఁ బ్రజలు
భరతమాతకు హారతిఁ బట్టిరపుడు
గ్రామములఁ బాడినారు స్వరాజ్యగీతి.

కృష్ణజన్మస్థలంబని యెంచి ప్రజలు
జైలునకుఁ దీర్థయాత్రలు సల్పిరపుడు
భూరికీర్తి నార్జించిన పుణ్యపురుషు
లుండ నది తపోభూమియై యుర్వి వెలసె.

దేశదాస్య నిగళములఁ దెంచు దీక్షఁ
బ్రాణధనములఁ జిల్లిగవ్వగఁ దలంచి
ధారవోసిరి యువజనుల్ త్యాగనిరతి
సర్వలోక మా గాథను సంస్మరింప

# నేఁడు

నేఁడు విజయపతాక విన్వీథి నెగిరె
దాస్యనిగళముల్ దెగెను స్వతంత్రలక్ష్మి
కాంతిఁ జిలికించి యెదుట సాక్షాత్కరించె
నయనపర్వమై చిరతరానంద మొప్ప.

వేయిపడగల నాగుఁబామో యనంగఁ
బ్రజల నవినీతి తలయెత్తె భయముఁగొలిపి
సాధుపురుషుల హింసింపసాగె నేడు;
ఇద్ది యేనాటి పాపమో యిట్లు పండె.

ఇచటి ఘోరపాపములు శమించుగాక!
చౌర్య భీషణ కృత్యముల్ సమయుఁ గాక!
ధర్మసందీప్త భాస్కరోదయము కాగఁ
జీఁకటిబజారుల వెలుంగు ప్రాఁకుఁ గాక!

మేము నిర్ముక్త భానుండు మెఱసినట్లు
భరతభూమిని భాగ్యంబు కరమువెలయు
నుర్వి శాంతిసామ్రాజ్య నవోదయమ్ము
ధర్మదీప్తి నుజ్జ్వలముగఁ దనరుఁ గాత!

---

# జయ గీతిక

స్వస్థ చిత్తాన్వీత సంతాన విహితయై
ప్రమదంబుఁ దోపించు పరమార్థ యుతమతి
మాతల్లి లోకాన మాన్యత వెలయించు
మామాత నగకన్య మాయాత్మ నమృతంబుఁ.
దొలికింపఁ దోపింపఁ దుష్టినిఁ బుష్టిని
సృష్టిలోఁ గనిపింతు మిష్టార్థ సిద్ధిని
మాగంగయమునమ్మ మాకృష్ణ గౌతమి
మాపైనఁ గృపఁ జూపి మాకన్న మిడుచుండ
మాయిష్ట దైవంబు మహితుండు శితికంఠు
డాత్మలో నర్తింప అవనికి జేజేలు
అఖిల జీవాళికి అనంద చంద్రికల్
భరతమాతకు జేలుపల్కుదుము సతమ్ము
దివ్యలీలాకేళి భవ్యమై శోభింప
కలకంఠముల నెల్లఁ గల్పుడీపాడుడీ!
ఆడుడీ! పాడుడీ అఖిల విశ్వమునందు
భరతమాతకు జేలు పల్కుడీ! ప్రజలార!
ధన్యజీవుల మహో! ధరణిలో మనమెల్ల
అరివర్గ మడలుచు అవనిలో హితమార
అమ్మకు జేజేలు అనిశంబు నవైదము
సత్య ధర్మములకు నిత్యంబు జేజేలు.

---

# ఆకాంక్ష

వేదశ్రీ రుచిరోజ్జ్విత స్వరమున న్విద్యల్ ప్రసాదింపగా
శ్రీదేవీపతి దివ్యవీక్షణము లుర్వింబర్వి రక్షింపగా
మోదోత్తుంగ తరంగ సంతతి సదా పొంగారఁ జిత్తంబునం
దేదైన్యంబునులేని జీవితము శోభించు న్వివేకాఢ్యమై.

అల వాసంతదినంబులోయన నమందాహ్లాద రేఖాతతుల్
విలసిల్లన్ ద్విజసంతతుల్ మధురమౌ వేదోక్తులంబల్కఁ ని
ర్మల ధర్మాగము పల్లవింప వికసింపన్ సత్యవాక్పుష్పముల్
నిలువెల్లం బులకించుఁ బ్రాణితతి నిర్నిద్ర ప్రశాంతస్థితిన్.

నిజ శరీరంబున బలము నిండియుండ
ఆత్మశక్తు లజేయమై యంటియుండ
ఇష్టమృష్టాన్న కలన సంతుష్టు లగుచు
ధర్మదీప్తిఁ బ్రకాశింత్రు ధరణిఁ బ్రజలు.

ఓం తత్సత్



# శుద్ధపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 2 | కాంక్షఁగా | కాంక్షఁ |
| 15 | 12 | కొంటికిఁకదోయి! | కొన్నావుభళిర! |
| 22 | 3 | బరహీంతమును | బరహింతమును |
| 24 | 3. | ఋనాదులు | బునాదులు |
| 29 | 5 | బాండిత | బాండితీ |
| 30 | 21 | చెలువందు | చెలువొందు |
| 33 | 16 | మోహాంబనన్ | మోహాంబునన్ |
| 39 | శీర్షికలో | శెట్టి | సెట్టి |
| 40 | 1 | వారాసి | వారాశి |
| 45 | 4 | నిలచి | నిలిచి |
| 46 | 13 | పూర్గ్ణచంద్రునిన్ | పూర్ణచంద్రునన్ |
| 46 | 19 | నినాదంబో | నినాదంబా |
| 47 | 18 | బాపయాంఖ్య! | బాపయాభిఖ్య! |
| 50 | 16 | సర్వ్యలోక | సర్వలోక |
| 51 | 13 | మేషు | మేఘు |